# AGNI SILPI

Vuyyuru Rama Krishna Srenidhi

DECEMBER 1991



Price : 5/-

For Copies :
VINODHINI PUBLICATIONS
RAJU PETA,
TIRUVURU - 521 235
Krishna Dt. (A P.)

Printed at :
SAI SUDHA PRINTERS
Arundal Pet, Vijayawada-2.

# AGNI SILPI

Vuyyuru Rama Krishna Srenidhi

DECEMBER 1991



Price : 5/-



For Copies :
VINODHINI PUBLICATIONS
RAJU PETA,
TIRUVURU - 521 235
Krishna Dt. (A P.)

Printed at :
SAI SUDHA PRINTERS
Arundal Pet, Vijayawada-2.

# కాళరాత్రి

కడలి మీదికి పడవలోన
నేటి పూటకు కూటికని
వేటకు వెళ్ళెను
పస్తులున్నా బెస్తవాడు

పుడమి తలమున
పడవ నడుమున నిలిచెను
కడలి కడుపున చూచెను.
గాలము తీసెను
గాలులు వీచెను
విసరి వలను వేసెను
కసిరి జలములు లేచెను
తలవంచడు వనికి
పయనించెను లోనికి
పిల్లల రోదన
ఇల్లాలి వేదన
స్ఫురించెను స్మరించెను
మొండిధైర్యము ముందుకు నడిపెను
కారుమబ్బులు క్రమ్ముకు వచ్చేను

ముల్లోకాలను కల్లోలపరచే
గాలులు వీచెను జాలరి వైపు
పోటీపడుచూ వచ్చెను
వేటకాని వైపు వరుణుడు

భీభత్సం చేసెను
నిరుత్సాహం వేసెను
మేఘం వేగం పెంచెను
అంధకారం బంధించెను
వర్షపుజల్లు వేగం పెంచి,
కార్మికుడొంటిని నీటితో నింపెను

జడిలో, పడవలో
పెనుకడలి వడిలో
గాలీ చలి నడుమలో
ఆటూ పోటూ కూటమిలో
వేటకాని దుస్థితి
కాటిలోని పరిస్థితి

ఛేదించలేదు వేటిని
సాధించలేదు వేటని

తలపోసెను వీటికై
విలపించెను కూటికై

ఇంటిదారి కంటపడక
ఒంటరిగానే ఉండిపోయెను
పుడమిలోనూ పడవలోనూ
కారే నీరు పెరిగిపోయెను

వెనుక లేచెను పడవ
మునకవేసెను ఒక తడవ

మృత్యుదేవి విసిరెను పాశం
తీసెను ప్రాణం
దాని కసి తీరెను పాపం
చల్లారెను కోపం

# శ్రమవాటిక

నీ శరీరం—
రగులుతున్న ఓ రాక్షసి బొగ్గులా వుంది
కదులుతున్న
ఓ జీవగోళంలా వుంది
పొంగుతున్న స్వేద సముద్రం
అగ్నిపర్వతం నుంచి
ఎగజిమ్ముతున్న భాస్వరపు లావాలా వుంది
నీ అగ్నిశ్వాసం,
ప్రకృతిని మేఘావృతం చేస్తుంది

వాతావరణాన్ని
తుఫానుకు సిద్ధంగానూ
యుద్ధానికి సన్నద్ధంగానూ
తీర్చి దిద్దుతున్న
అధిక ఉష్ణాన్ని,
అల్పపీడనాన్ని
సృష్టిస్తున్నది నువ్వే.
కానీ,
మళ్ళీ నువ్వే

దానికి బలి కావటానికి ముందుకొస్తున్నావు,
బానిసగా మారటానికి సిద్ధపడుతున్నావు

నీవు సృష్టించిన తుఫానే నిన్ను ఈడ్చికొడుతుంది
నీ స్వేద సముద్రంలో
నిన్ను ముంచి చంపుతుంది
నీ జీవ_పీనుగును,
నీ దేహ ఉష్ణంతోనే కాల్చి బూడిద చేస్తుంది.

అప్పుడు
మళ్ళీ మామూలే,
కద మొదలుకొస్తుంది
చల్లారిన నీ కాయం
తెల్లవారి కూలికెళుతుంది_

ఇది నీకెప్పుడూ మామూలే,
ఎందుకంటే,
నీ వొక స్వేద సముద్రుడవు
స్వేద సముద్రం నుంచి
ఉదయించే శ్రామిక సూర్యుడవు.
అంతేకాదు,
ఈ వ్యవస్థ చితిమీద
సగంకాలి
సగం మిగిలిన
సజీవ పీనుగవి

# ఇటుక

యంత్ర కంకాళాల మధ్య
అక్కడొకటి
ఇక్కడొకటి
మానవ కపాళాలు పిలువగా....
నీవు
వేగిరం వెళ్ళేప్పుడు గాని

ముచ్చమటల
ఆచ్ఛాదనంలో
నీ శ్రమ నగ్నత్వాన్ని దాచుకునేప్పుడు గానీ....

నికరాదాయాల
శిఖరాగ్రం మీదకూర్చుని
"దాహం" తెమ్మని అడిగిన వాడికి
నీ స్వేదం కావడిలో నింపుకుని
పర్వతారోహణం చేస్తునప్పుడుగానీ....
నీ కనిపించలేదా....?
నిన్ను
ఓటరు పీనుగగా మార్చి
ఈ వ్యవస్థ మార్చురీలో
భద్రపరచారని.

ఒరేయ్,
నువ్వు,
నిరక్షరాస్యతా నివురుకప్పిన
నిప్పువురా
నువ్వు....

నిర్లక్ష్య కక్ష్యలలో నిదురించే
నిప్పుకళ్ళ పక్షివిరా నువ్వు

నువ్వు తిరగబడవు కాని
నువ్వంటూ ఎదురు తిరిగితే,
నువ్వొక
ఎర్రగా కాలిన యిటుకరాయివై పోతావు
ఈ వ్యవస్థ సమాధి నిర్మాణంలో
నీవొక
పునాదిరాయివై పోతావు

# చెదలపురుగులు

నీ కంటే నిర్జీవినయం,
నిర్జీవికంటే 'నీడ'నయం
పేడ పురుగునయం,
లేగదూడనయం,
ఓ త్రాగుబోతూ-
పెళ్ళాన్ని కొట్టి,
పిల్లల్ని భయపెట్టి
పోపు డబ్బాలో దాచిన
పాల డబ్బులు దోచి,
ఆ పైకం మైకానికి వెచ్చించి,
కంకర కుప్పలపైచేరి
వంకరటింకరగా నిదురించే నీ కంటే
పెరిగిన గడ్డం నయం
గొరిగిన క్షవరం నయం రా,

నాన్నిచ్చిన భూమిని తెగనమ్మి
'నాంతాడు'ను తాకట్టు పెట్టి
వచ్చిన సొమ్ముతో నీవు చేసే ఖర్చు ఏ పాటి
నీవు త్రాగిన ఖాళీసీసాలు అమ్మగా
వచ్చే ఆదాయం ముందు?

పెళ్ళానికి క్షయ,
పెరిగిన కూతురుకు పరాయివాడి సైటు.
ఇవేమీ నీకు పట్టవ్
చదువు మాని కొడుకు
కొట్లో గుమాస్తా గిరి చేసి తెచ్చే సొమ్ము
వాకిట్లోనే ఎగరేసుకు పోతావ్

ఒంటి పూట తిండికీ,
గొట్టు కారపు కూటికీ,
అలవాటు పడిన నీ సంసారమేకదూ
నీ కొాక పెద్ద సమస్య ?

ఆ సమస్యలనుంచి తప్పించుకోవటానికే కదూ
ఆ చిరాకుల నుంచి దూరంగా పోవటానికే కదూ.
నీవు సారాకొట్లో షరాబీగా మారేది ?

నీమీద నీకు జాలి కలిగినపుడు,
నీమీద నీకు కోపం వచ్చినప్పుడు
నీకు తిరిగ్గా సేదదీర్చేది
ఆ, ప్రభుత్వ సారాయి దుకాణమేగా !

అందుకేరా ఓ త్రాగుబోతూ
అంటున్నాను నేను-
నిన్ను, నగ్నంగా నడివీధిలో నిలబెట్టి
నిలువునా నరికి పారెయ్యాలని!-

గొడ్డుబోతు గొడ్లను కటికవాలంకు అమ్మలేదా?
మోడు బోయిన మానును మొదలకంటా నరకలేదా !?

# బాలభిక్షువు

దారి ప్రక్కనే,
నీడనివ్వని చెట్టు క్రిందనే
ఆరని కుంపటి తీరుగనే
కూర్చున్నదా ?
కాదు.
కూలిపోయింది పాపం !
ముసల్దికాదు, పసిబాల.
మూలుగెక్కడిది ?
ముసురుతున్న ఈగల గోలే అది

ముగ్గుబుట్ట వంటి తలకాదు,
ముళ్ళకంచె వంటి జుట్టు
ముడతలు తేరిన దేహమేది?
మడతలుపడిన ఎముకలు తప్ప
కళ్ళులేని కణతలే కాని
కాంతిలేని గాజు కళ్ళెక్కడవి?
తానేగా తదుపరి శవం !

పడిపోలేదు జబ్బుచేసి,
పాడుబడినది ఆకలేసి
అడుక్కొనే శక్తి ఉన్నా
అన్నంపెట్టే అమ్మేలేదు,

రానున్న ఆ చలికాలం నయం
మండుతున్న ఈ ఎండలకన్నా

వేళ్ళు ముడిచి, కీళ్ళు మడిచి
సడలిపోని కోర్కెలతో
సుడులు తిరిగే ప్రేవులతో
ఆకలి మంటలు నార్పేటందు
చీకటి మాటుకు చేరుతున్నది !

ఆ పాపే మరణించాలి
ఆ పాపం నాకే కావాలి" అంటూ
వడగాడ్పు వచ్చి వెళుతున్నది
ఎముక ముక్క కొరికేటందుకే
కాటిలోనినక్క కాచుకొన్నది!!
మ్రోగే ఈగల వైపే
చూస్తున్నది ఆ తొండ

పట్టపగలు, మిట్టమధ్యాహ్నం
క్రమ్ముకొచ్చెను కళ్ళమీదకు
చిమ్మచీకట్లు!
"ఇదీ నా పాపమే!" నంటూ
వడగాడ్పును వెక్కిరించుతూ
ఎగిరే మీదకు ఎర్రదుమ్ము

(మహాకవి శ్రీశ్రీగారి "భిక్షువర్షీయసి"కి అనుకరణ)

రామకృష్ణశ్రీనిధి

# ఆతిథేయి

కన్న తల్లివి
కన్న కూతురువి
చిన్న చెల్లెవి
చిన్నమ్మవి
అమ్మమ్మవీ, నానమ్మవి
అమ్మలుకన్న అమ్మవి
చరిత్రను కన్న జేజెమ్మవి
వంశవృక్షాన్కి ఆది బీజీవిని
జనవిశ్వానికి గరిమనాభివి

నీకు మాత్రం వంశంలేదు
నీకొాక గోత్రం రాదు
నీదొాక కులం కాదు
నీకొాక మతం లేదు

సీతా, సతి
దేవదాసి, రాజనర్తకి ఇలా....
ఎన్నో ....మరెన్నో
భూమికలు పోషిస్తున్న దానివి

ఎప్పుడో మొలచి, మరి
ఎక్కడో పెరిగి

జన్మదాతలను మరచి
అన్నదమ్ములని, అక్కచెల్లెండ్రని
అయిన వారిని, తోటివారిని వదలి
పెంపుడు జంతువులను
పూల మొక్కలను
ప్రాంతాలను, పరిసరాలను అన్నింటినీ
విడిచివస్తావు,
ఓ మానుని మొగుడిన్ని చేయటం కోసం,
ఓ వంశవృక్షాన్ని ఫలవంతం చేయటంకోసం!

భర్తను చేసి
వాడి ఖాళీ జీవితానికి భర్తీ అవుతావు....!!

కుటుంబ గొడవలు,
కడుపు కోతలు,
రాద్ధాంతాలు,
రచ్చకెక్కటాలు చవిచూస్తావు.

చావు దెబ్బలు,
సంధి జ్వరాలు,
రాతలు, రోగాలు,
రోతలు, కలతలు,
నెప్పులు కలకలు రుచిచూస్తాయి.

అత్తలుపెట్టె అగచాట్లు
ఆడబిడ్డలు చేసే ఆరళ్ళు అనుభవిస్తావు.

యింకా....
పుట్టెడు సంతానాన్ని
బండెడు కష్టాల్ని కలగలిపి చేస్తావు....
బండ చాకిరీని
గుండెపోటునూ భరిస్తావు
కండపుష్టిని

కంటి వెలుగును కోల్పోతావు
ఎన్నో ఘోరాలకు
ఎన్నో దారుణాలకు గురి అవుతావు....

నిన్ను
పూల సజ్జవంటారు
భూదేవిని నీ వంటారు
సెలఏటి నీటివని
చలిలోని వేడివని
చంటి పిల్లవని
యింటి మనిషివని
కుంటిసాకులెన్నో చెపుతారు
అన్ని మాయ మాటలు నీవేవింటావు

బలహీనమైన శరీరం
బలమైన మనస్సు
ఆశయాలు కలదానివి
అవకాశాలు లేనిదానివి.

నిన్ను
సలహాలు అడుగరు
సంప్రదించరు
సంఘంలో చోటే యివ్వరు
అర్థంకాక అడిగినదాన్ని
'అర్థంకాదు పో' మ్మంటారు.

నీ జన్మ నుంచి నీ మరణం వరకూ
నీ ప్రమేయం లేనిదానివి నీవు.

నీ అందాన్ని వంట గదిలోనే పొగ చూరపెడతారు
నీ ప్రతిభని పురిటి గదిలోనే దిగజార పెడతారు

నీవులేని గ్రామమే లేదు
నీవులేని గృహమే లేదు

మానవా వనిలో
అర్ధగోళాన్ని ఆక్రమించినది నీవే,
చరిత్రపుటలలో
వ్యర్థ అంశంగా మిగిలిపోయింది నీవే.

ఏమి దక్కింది నీకు
చరిత్ర కెక్కావా నీవు ?
వాడుకున్నారు
వదలిపోయావు !

నీ బ్రతుకొక లోయ
గతకాలం అంతా మాయ

ఎందరయ్యారు మీలో విద్యాధికులు ?
ఇంకెందరు కవయిత్రులు ?
మరెందరు వీరనారులు ?
మరెందరు పరిపాలకులు ?
ఎవరికి దక్కింది చరిత్ర ?
ఎందరికి చిక్కింది ధరిత్రి ?
'వెయ్యింట ఒక వంతు !
నిప్పులరాశిలో ఉప్పుగల్లు ! !'

చరిత్రకే తల్లివైన నీకు
చరిత్రే లేదు తల్లీ ....

అమాయక సామ్రాజ్యానికి మాత్రం
నీవు అనధికార చక్రవర్తిని
అన్యాయాల ఊబిలో
ఆధారం లేని జీవివి
రానున్న కాలంలోనూ
కానున్న బలిపశువివి !
ఏమైనా ఎన్నైనా
ఆఖరికీ నీవు ఆడదానివే !

# వారసుడు

ఉరివేసుకు చనిపోయాడు
ఊరిచివర !
గుట్టమీద, బావిపద్ద,
చెట్టుకొమ్మకు,
కొట్టుకుంటూ పోయింది ప్రాణం !

'ఎవరైనా అడ్డువస్తారేమో,
ఆపివేస్తారేమో'
అని చూశాడు ఆశతో,
ఎవరూ రాలేదు.
నిజంగానే 'చావాల'నుకున్నాడు
చనిపోయాడు.

తండ్రిని దేశం ఉరివేసింది
'అడవిమనిషి' అని,
ఊరు తనని వెలివేసింది
'వాడి' కొడుకని !
అసహ్యించి, అవమానించింది
అభిమానం తనకుంది !

అందుకే_
బావి వద్దకు వెళ్ళాడు,
బావి మహాభయంకరంగా ఉంది.
పాడుబడ్డ పాతబావి కదా ?
భయం కలిగించింది.

ఇక మార్గం లేదు
తండ్రిమార్గానే తనూ వెళ్ళాడు!

# కొత్త కుంపటి

గుడిసెలోన కటిక చీకటి
కారుమబ్బులా పేరుకున్నదని తలచి,
గుడ్డిది,
పిలిచె, కోడల్ని
పలకలేదు కోడలు పిల్ల—
గుర్తుకువచ్చె గుడ్డిదానికి—
కోడలి కుంకుమ చెరిగినదని
తలకొరివికి తనయుడులేడని
కోడలు యింటలేదని
పుట్టింటికి పోయినదని—
చరిత్ర తలచి చెమర్చె కళ్ళు
చూపుకరువైన గుడ్డికళ్ళు !

తలుపుతీసి,
తలాపి నున్నా బుడ్డిని తీసి,
అగ్గిని ఇచ్చి,
గుడిసె గూటిలో పెట్టెను
గుడ్డిది, గుడ్డి దీపాన్ని !

గూటినుంచి, గుడిసెకంటి
కొరలు చూపి, కరములు చాపి,
కొరివిదయ్యం పైకి, పైకి,
పాకపైకి పాకిపోయెను!

పాడె గేదె, తాడు తెంచుకు, ఉరికిపోయెను !
కోడిపెట్ట గూడు వదలి ఎగిరిపోయెను ! !

నిప్పు వేడికి నిలువలేని
ముసలిదానికి తెలిసిపోయెను !
పరుగున కదిలి,
వగరుస్తూ వచ్చి,
కేకలువేసెను, భీకరముగ!!

ఊరువారు చుట్టుచేరిరి,
ఊరుకొనక నీరుపోసిరి:
చల్లార్చినారు నిప్పుకణికలు
ఆర్పినారు అగ్నిజ్వాలను.

ఐనా–
ఏమున్నది అక్కడ?
వెలిబూడిద ఒక్కటే–

కొడుకు తెచ్చిన కూలిగింజలు కాలి పేలాలయ్యేను
కోడలు కూడబెట్టిన డబ్బుల డబ్బా బూడిదయ్యేను
గుడ్డిదాని గుడ్డలేమి మిగలకపోయెను
అన్ని అగ్నికి ఆహుతి ఆయెను

ఏడ్చెను ముసల్ది !
'ఎందుకు ఈ బ్రతుకులని
ఏమున్నవి మెతుకులని,
రాదాయె గుడిసె–
రాదాయె మనిషి' అని.

ఓదార్చే ప్రయత్నం ఆపి
వూరివారు వెడలిపోయిరి

బూడిదయిన గుడిసె రూపును
మనసు కంటితో చూసుకొన్న ముసలిదానిక–
మొండిచెట్టుపై పిడుగుపాటు !
గోరుచుట్టపై రోకటి పోటు !
గుడ్డి బ్రతుకుపై గొడ్డలిపెట్టు !

# జగన్నాటకం

అక్షయపాత్రలూ,
శమంతకమణులూ,
పురాణ కథలే.
నిజ జీవితంలో
నిత్యదరిద్రం.
కరువు కాటకాలు ఒకవైపు,
పరువు ప్రతిష్టలు మరోవైపు.
మానవుని మీద
మానవుని వేట,
వేటకుక్కలపై వేలంపాట!

(పరువు ప్రతిష్టలు అనే పదాన్ని అర్థంలేని సాంప్రదాయ ఆచారాల్ని దృష్టిలో పెట్టుకుని ఉపయోగించటం జరిగింది.)

# మధ్యతరగతి

దేవుడికీ
మనిషికీ మధ్య చేడా ఏమిటి ?
అలంకారాలు !

మనిషికీ
జంతువుకు మధ్య వ్యత్యాసం ఏమిటి ?
దిగంబరత్వం !

అటు దేవుడు
ఇటు జంతువు కాని జీవే
మధ్యతరగతి మానవుడు !

# RIOTS OF RYOTS

సూర్యుని దేమున్నది?
పగలు ప్రకాశించి,
రాత్రికి విశ్రమిస్తాడు.
మేము మాత్రం,
"భూమి పుత్రులం"-
అనుక్షణం ఉద్యమించుతాం
ప్రతిక్షణం ప్రకాశించుతాం
భూమితోనే తిరుగుతాం
భావిలోనికి ఎగురుతాం
కాలానికి ఎదురీదుతాం !
కష్టాలకి ఎదురేగుతాం ! !

[ఎరువుల ధర పెరుగుదలపై రైతుల తిరుగుబాటు వార్త చదివి]

# గాయాలు



అమ్మతమ్ముడు మామయ్య-
నాన్న తమ్ముడు బాబాయి-
ఇద్దరూ తమ్ములే అయినా
ఇరువురూ ఒకటిగా పిలవబటంలేదు
ఏమిటో !
అమ్మా నాన్నలే సమానం కాదని
చెప్పే
అర్థంలేని ఈ వావివరుసలు.

నాకు, నీకు,
మాకు, మీకు తప్ప
సింగిల్‌గా వున్న
ఆ థర్డ్‌పర్సన్‌గాడికే
's' చేర్చిన
ఆ verbను కేటాయించి
మన వర్ణ వివక్షతని
వ్యాకరణంలో సైతం చాటాలని
చెపుతుంది భాషా శాస్త్రం.

వాడు పీల్చిపారేసిన గాలికి లేని,
వాడ్ని ప్రేమగా స్పృశించిన
వెలుగుకు రాని,

వాడ్ని అనునిత్యం తన ఒడిలో
లాలించే భూమాతకు సోకని,
వాడి చమట బిందువే మేఘమై
వర్షించిన వాననీటికి లేని-
అస్పృశ్యత, అంటరానితనం
వాడికి మాత్రమే ఎందుకో !?

ఏమిటో,
ఇలా
మాయని మచ్చల్లా....
నా దేహం నిండా....
అన్న,
సెలయేసే సందేహపు గాయాలే!

# వింత జంతువు

వాడి మొఖం,
కపాళాలు వెలవెలబోయేలా,
దొంగ ఆప్యాయతలని పొంగరిస్తున్న
ఓ తపేళా మొఖం–

వాడి దేహం,
రాజకీయ సిఫిలస్ కురుపులు
రొచ్చు గుంటలుగా మారిన
ఓ రహదారి–

వాడి మనస్సు,
తీరని ఆర్థిక దాహంతో
సదా తహతహలాడే
ఓ సహారా ఎడారి–

వాడి ఆలోచన,
కుళ్ళి, పురుగులతో లుకలుకలాడే
ఓ పదవీ రాక్షస వేశ్య శవం–

వాడి తెలివి,
స్వార్థం అనే–
ఆరని రావణ కాష్టంలాంటి

గనేరియా పెగతో కుంచించుకుపోయిన
ఓ పురుషాంగం-

వాడి కడుపు,
మధ్యతరగతి మానవ అస్తిపంజరాలతో
నిరుపేద స్త్రీల, నీళ్ళ రక్తంతో
నిరక్షరాస్యుని ఆశల మాంసంలో
కలసి ఉడుకుతున్న
ఓ గుడుంబా కడవ-

ఇంతకీ ఎవడువాడు?

వర్గాలకి 'వర్ణా'లను గుర్తులుగా చేసి
కండువాగా మార్చి
జండాగా ఎగురవేసి,
తన కాళ్ళనూ, తన చేతులనే
తన పదవీ సింహాసనానికి
పాదాలుగా, పాదుకలుగా చేసుకొని
పదిలంగా కూర్చుని-

ఐదు సంవత్సరాలకు ఒకసారి
పాచిపళ్ళు తోమి,
ఓటుకోసం యాచకం చేసే
నీచ రాజకీయ నేత-

# విశ్వాంతర్యామి

డబ్బు,
అత్యంత ఆధునికమైన
ఓ మారణాయుధం అది.
మహాయోధుణ్ని సైతం
తునాతునకలు చేయగలదు—

అది,
శక్తివంతమైన బీజాక్షరాలు
అద్భుతంగా అమర్చబడిన
ఓ క్రూరమంత్రం
భూభ్రమణాన్ని
కాలప్రవాహాన్ని
స్తంభింపచేయగల
క్షుద్ర రాజకీయ యంత్రాంగం—

కీకారణ్య వీరుల్ని
మహాపర్వత బాహువుల్ని
అనంతలోయల పాదాల్ని
అవలీలగా నమిలి మింగివేయగల
విశ్వరాక్షసి— అది.

సుడిగాలుల దారి మళ్ళించగలదు
పెను ఉప్పెనల వేగం పెంచగలదు
సూర్యచంద్రుల కళ్ళు కప్పి
చీకటి ధూళిని వెదచిమ్మగలదు
అహంకార వట వృక్షాల్ని
అందంగా పెంచి,
అజ్ఞాన ముత్యాల్ని పూయించగలదు-

కామవాంఛలని,
నైతిక విలువలని,
సామాజిక సిద్ధాంతాలని,
ప్రకృతి ధర్మాలని
శాస్త్ర పరుధులని
నిర్ణయించగలిగిన
ఆటవిక శాసన చట్టం అది-

ఐ.యం.యఫ్.'లు
అయిల్ వార్‌లు
అణుబాంబులు ....
దాని దశావతారాలు

ప్రవక్త,
పవిత్రత,
సంస్కృతి,
సాంప్రదాయం....
దానికి వున్న మరో పది పేర్లు.

వైటుహౌస్‌లు
వాషింగ్‌టన్‌లు, దాని
విలాస కేంద్రాలు

స్త్రీల జీవితాలు
చిన్నారుల చిరునవ్వులు
దాని మెడలో మణిహారాలు-

భిక్షువాడి రక్తం,
కూలివాడి కాయం
పేదవాడి ప్రాయం,
దానికి నైవేద్యం

కళానికి,
కత్తికి,
శక్తికి,
యుక్తికి,
"ముక్తి" ప్రసాదించే
భయహస్తం అది-

అదొక, ఆకారంలేని బ్రహ్మాస్త్రం
ప్రపంచం దాని ముందొక ప్రాణంలేని పిపీలికం

# బ్రహ్మజ్ఞానం

సూర్యుడు
పర బ్రహ్మ స్వరూపం
పంచభూతాలకి ఆధారం
పంచభూతాల కలయికే అన్నం.

అన్నం
సూర్యశక్తి స్వరూపిణి
శక్తి ప్రదాయిని
శక్తి శ్రమకు మూలం

శ్రామికుడు శక్తి కేంద్రం
శక్తి సూర్యుని ప్రసాదం
శ్రామికుడు పర బ్రహ్మ స్వరూపం!

* * *

సంపద శ్రమోత్పత్తి
సంపదకు మారకం
ద్రవ్యం.

ద్రవ్యం
శ్రమకు కొలమానం
ప్రభుత్వానిక్కి ప్రామాణికం
ప్రభుత్వం రాజ్యం
రాజ్యాధిపతి రాజు

సూర్యుడు రాజు
శ్రామికుడు రాజు,
శ్రామికుడు సూర్యుడు
రాజ్యం రవికే దక్కాలి

# దారులు

జరిగిన దౌర్జన్యాన్ని
జరుగుతున్న దోపిడీని
తన 'ఖర్మం'గా తలచినవాడు
వైరాగ్యంతో
బైరాగై పోతాడు
ఆదే,
వ్యవస్థ ధర్మంగా భావించినడు
నిప్పై నుండి
విప్లవశక్తిగా అవతరిస్తాడు

# దీవెనకై వేడికోలు

క్షణంలో
చిటుక్కున చంపబడింది
ఓ నిరుపేద ప్రాణం
మరుక్షణంలో
ఆచూకీ తెలీకుండా
మటుమాయం చేయబడింది
ఆ శవం,

తారురోడ్డు మీద మాత్రం
ఓ ఎర్రని రక్తగాయం!

*　　　*　　　*

ఈ వ్యవస్థ విచిత్ర భంగిమను చూసి
నీలి సముద్రంలో లీనమయ్యే
నైలునదిలా,
ఓ సన్నని అశ్రుధార
నాలోచనా పర్వతాల నుంచి జాలువారి
హృదయ-గోళంలోని
ఆలోచనా సాగర తరంగాలతో
కలిసిపోయింది
కలచివేసింది

అది ఓ భావగంగా పొంగి,
వ్యవస్థను ముంచెత్తి
సమస్త లోకాన్నీ ప్రక్షాళన చేయాలని
దీవించండి,
జగత్ ప్రసిద్ధి గాంచిన
ఓ భారతీయ
దుర్భలులారా
దౌర్భాగ్యులారా,
అర్భకులారా,
అభాగ్యులోరా!

# అగ్నిశిల్పి

నివురు దులిపి

నిప్పు రగిల్చి

అజ్ఞానం అగ్నికిభోజ్యం కావించి.

కవి చేతిలో కలం

చింతనిప్పును శిల్పంగా మార్చుకున్నది!

అగ్ని భట్టారకుని పుత్రికై

అహో రాత్రం శ్రమిస్తున్నది!

అగ్ని హృదయాన్ని ఆయువుపోసి,

అగ్ని మనస్సును ప్రతిష్ఠిస్తున్నది.

..................................................................

..........................................................

ఆవేశానికో ఆకృతి!

ఆందోళనకో ఆశయం!!

..................................................................

..................................................................

..................................................................

..................................................................

పిల్లేపుల్లై రెచ్చిపోయే దృశ్యం

నీళ్ళే నిప్పై రగిలే బడబాగ్ని

జలంనుంచి జ్వాలలు లేస్తున్నాయ్

అలలు అలలుగా ఎగస్తున్నాయ్!

..........................................................

..........................................................

..........................................................

..........................................................

హోమ గుండంలో అఖండ జ్వాల !

సుడి గుండంలో బడబాగ్ని కీల !

నది గుండెలలో ఆవేశపు హేల !

# నిర్వచనం

కవిత్వం-

జన సంఘర్షణల్లోంచి
మనోగుర్షణల్లోంచి
జనించేదే జీవ కవిత్వం !
విశ్వమే దాని పరివాహక ప్రాంతం!
సత్యమే దాని ప్రాకృతిక సూత్రల ! !
అది
సామాజిక మంత్రదండం
వైజ్ఞానిక కమండలం

కవిత్వం అంటే-

కుతంత్రాలను విప్పిచెప్పేది
కరకు కరవాలానిక్కి పని కల్పించేది

కవి-

జీవితపు లోతుల్ని తాకి చూసేవాడు
అమృత విషాల్ని గ్రోలి తెలిపేవాడు

కవనేవాడు-

అనుభవాలలో ఆరితేరిన వేటగాడు
అతను పంపే ఒక్కొక్క పదం
పులి గుండెలలో లోతుగా పాతుకుపోయే
పదునైన బాణం!



రామకృష్ణశ్రీనిధి

# ఫిజియాలజీ

సుస్థిరమైన శాంతి, శూన్యమండలంలోనే గోచరిస్తుంది
శూన్యం,
జీవ శూన్యమవటమే కారణం !
"అలజడి, ఆందోళన
అశాంతి, అసంతృప్తి, ఆవేదనా, ఆవేశం"
జీవ ప్రధాన లక్షణాలు.
జీవమున్న ప్రతిచోటా
అవి గళాల్ని విప్పుతాయి
దళాల్ని విరుస్తాయి
ప్రళయ దుందుభులు వినిపిస్తాయి

* * *

అవి శృతి మించినప్పుడూ శూన్యం ఏర్పడుతుంది.
శాంతి వినపడుతుంది

* * *

శాశ్వతమైన శాంతిని కోరేవారు
సుస్థిరమైన శూన్యాన్ని ఏర్పరచుకోండి !
జీవం పోరాటం కోసం పుట్టింది
శూన్యం కోసం కాదు !

# మహాప్రస్థానం

వేద్దాం!
ఏం చేస్తారో చూద్దాం !
అడుగుతీసి అడుగు ముందుకేద్దాం
ఎవడేమంటాడో చూద్దాం ॥వేద్దాం॥

చివరివరకూ సాగుదాం
శాంతిలేక పోరుదాం
మన భూమిలో మనం అడుగిడదాం
కాదన్నవాణ్ణి తరిమి తరిమి కొడదాం
॥వేద్దాం॥

అడవులెంట మనమంట !
నగరమంత వీరంట !
ఎవడు చెప్పిన న్యాయమంట ?
పాటించేదెవడంట?

తిప్పి న్యాయం చెప్పుదాము,
తప్పంటే అప్పుడే చూద్దాం ॥వేద్దాం॥

చస్తే పారేసేచోటు లేదు మనకు
మైళ్ళకొద్దీ పోరంబోకులు వీళ్ళకెందుకు?
పొలం దున్నేది మనమంట
పంట తినేది వారంట !

కాసులుకొద్దీ బంగారంమోసే
మెడలుమీర
కాణీ గట్టి మాగాణిని దున్నుదాం
బంగారం పండించి,
భావితరానికి పంచుదాం ॥వేద్దాం॥

ఏరు వీరిదంట
నీరు వీరిదంట
గాలి వారు తెచ్చిరంట
వెలుగు వారు పంపిరంట

ఎవడు రాసిన రాతంట?
ఎక్కడుంది చెప్పమంట!
ఆ తలరాతలు తిరిగి రాద్దాం ॥వేద్దాం॥

పెట్టుబడీ పెట్టిరంట
ఫ్యాక్టరీలు కట్టిరంట
జీతమిచ్చి జీవితాలు కొంటిరంట
మన జీవితాన్ని
లాభానికి అమ్ముకొందురంట!

శాంతి ముసుగు ధరియించి
క్రాంతి వీరుల్ని మింగినారు
ప్రజాస్వామ్యం పేరుతోన
ప్రలోభాలు పెట్టినారు

వీరెత్తులకు ఎదురులేదంట
వీరికెదురు నిలిచే వీరులే రారంట !!

రండిరా, రండి
వచ్చిమీద పడండి
మొక్కిన కాళ్ళను ముక్కలు చేయండి
కొట్టిన చేతులు నరకండి..... ॥వేద్దాం॥

# భయం

ఏమిటీ! గప్పడ గప్పడమని చప్పుడు?!
మువ్వల సవ్వడా?
కాదే !!
చెప్పుల చప్పుడా? కాదు.
మరి?
బండ్లులాగే ఎడ్లనకా ?
ఎడ్ల మెడలో గంటల మ్రోతా?
కాదు, కాదు.
సైనిక నడక లాగున్నది !?
ఐనా, ఈ సమయంలో
ఇటువైపు ఎందుకొస్తారు ?
రారు.
ఎవరు మరి!?
కొంపదీసి....
అడవి అన్నలు కాదుగదా
ఏమో....వాళ్ళేనేమో
ఆగిపోయారు.
అన్నలే కావచ్చు !

ఇంటికి మంట పెడతారులా వుంది!
మీదపడి మెడకోస్తారేమో !

ఇప్పుడేమిటి చెయ్యటం
ఏముంది సాధనం !

ఎవరినైనా తోడు పిలిస్తే
ఊఁ....హు. ఎవరూ రారు !
మనకీ ఈ ఊరివారికి పడిచావదు.
అప్పులు ఇచ్చి వడ్డీలు కట్టామని
తగువులు తెచ్చి, తిప్పలు పెట్టామని
రారు, వారు!
కొట్టామని తిట్టామని
మనమంటే ద్వేషం వాళ్ళకి
మనకి ఇలా జరగటం
వాళ్ళకు మహ సంతోషం! !
పేద ముండా కొడుకులు
ఓర్చలేని వెధవలు !
అవతలివాళ్ళకే తోడ్పడతారు
అడవి వాళ్ళకే సహాయపడతారు!

ఇప్పుడు, ఏమిటి చెయ్యటం,
ఏముంది సాధనం !!
తుపాకీ చూపిస్తే
తాళాలు లాగేస్తే !!....
అమ్మో....!!
అయ్యో....!!

# న్యాయవర్ణం

రక్తం ఎక్కడున్నా
రక్తమే
గుండెలో వున్నా
నడినెత్తికెక్కినా
అరికాళ్ళల్లోకి దిగినా
రక్తం ఎక్కడున్నా
రక్తమే

ఎరుపు ఎక్కడున్నా
ఎరుపే
పోలీసన్నల తలపై వున్నది ఎర్రచార!
చంటిపాపకంటిలో ఎరుపుజీర !
భూ గర్భంలో ఎర్ర పొర!
ఎరుపు ఎక్కడున్నా
ఎరుపే

రక్తం ఎక్కడున్నా ఎరుపే
న్యాయం ఏ జాతిలో ఉన్నా దైవమే

రక్తానికి రక్త నివాళులు
ఎరుపుకు ఎర్రదండాలు
న్యాయానికి నా దాస్యాంజలులు

# ఎప్పుడు

అడవుల నేలే ఆ విప్లవ సింహం
నడిబజారులో నడిచేదెప్పుడు ?
పెడబొబ్బలతో అరిచేదెప్పుడు ?
తొడలు చరిచేదెప్పుడు ?
దుశ్శాసనుని ఒడలు విరిచేదెప్పుడు ?

నడువలేని
నడములు లేని
అందలమెక్కిన ఆ అంధకారాన్ని
బందీగా మార్చేదెప్పుడు
హుందాగా ఈడ్చేదెప్పుడు!?

# యజ్ఞం

ఆది
అడవి
వీడని ఓ చిక్కు ముడి
దారీ తెన్నూ లేని మహాసముద్రం వంటిదది.
అందునుంచే పుట్టుకొస్తారు
అడవి సూర్యులు
అక్కడ,
చంద్రుడే కాదు,
సూర్యులు కూడా వెన్నెలకాస్తారు

అంతులేని శూన్యంలా అడవి పెరుగుతుంది
అనంతమైన ఆకాశంలా
వారి ఆశయం అల్లుకుపోతుంది
అసంతృప్తే వారి ఇంధనం
అందునుంచి పుట్టిన ఆవేశమే
వారి ఆయుధం
అనుక్షణం రగులుతుంది
ఆవేశపు దావానలం
క్షణక్షణం విస్తృతమౌతుంది-
అణువణువునూ ఆవహించి
అనంతాన్ని ఆవరిస్తుంది.
విజయాన్ని అధిరోహించి
విశ్వాన్ని ఆజ్ఞాపిస్తుంది.

అప్పుడే ఆ హోమం పరిపూర్ణం
అక్కడే, అ యజ్ఞం పరిసమాప్తం

రామకృష్ణ శ్రీవిధి

# MIND IT

మోసపోయి చవిచూశారా?
మీ నాలుకలు ఊడిపోయినవా?
మీ ప్రేవులు మాడిపోయినవా?
మునుపటిది కాదు.
చల్లగానూ, చప్పగానూ వుండేటందుకు
రాత్రికి రాత్రే మారిపోయింది
మా రుధిరం_
సల్ఫ్యూరిక్ యాసిడ్‌లా
సైనయిడ్ పాయిజన్‌లా !_
మైడియర్ కాపిటలిస్ట్ మస్కిటోస్!

# కృత్తిక

మహామహా ఉగ్రవాదులు
జనించేది
'కృత్తిక' నక్షత్రంలోనే అట,

ఔను,
మేము కృత్తికలోనే పుట్టాం
మహోగ్రవాదులం
ఉగ్రవాదులలో అగ్రగాములం

కృత్తిక రవి మహర్దశా నక్షత్రం
రవిగ్రహ రాట్టుడు
అతని ప్రియవర్ణం
రక్తవర్ణం

ఎరుపు ప్రియులం మేము
నీచగ్రహాల్ని - దుష్టగ్రహాల్ని
శాసించి శిక్షించే
గ్రహరాట్టులం మేము.

సూర్యుడు
చీకటికోనల జీవకోటికి

వేకువను తెచ్చి
వెలుగులు పంచే వీరుడు

అజ్ఞానాటవిక చీకటి సీమల్లో
అభ్యుదయ వెలుగులు కాసే
అడవి సూర్యులం
మేము.

కృత్తికాధిపతి అగ్నిహోత్రుడు
అగ్ని ఆదిదేవుడు
న్యాయాన్కి - సాహిత్యాన్కి ప్రతీక
ఆవేశాన్కి - ప్రాణం.

కృత్తికలో పుట్టువాడు
అగ్నిభట్టారకుడట

ఔను మేము
కృత్తికలోనే పుట్టాం
ఉగ్రవాదులం
ఉగ్రవాదులలో మహోగ్రవాదులం
మా అధిపతి ఆవేశాగ్ని
మా ధ్యేయం న్యాయం.

స్వచ్ఛత పవిత్రత
మా ఆత్మల ప్రత్యేకత.

[ఓ జ్యోతిష్య మిత్రుడు చేసిన విమర్శకు సమాధానంగా
వ్రాసినవే 'కృత్తిక' మరియు 'చిత్త' గేయాలు]

# చిత్ర

అంగారకుడు, భూమి పుత్రుడు
అతని దశా నక్షత్రం
చిత్ర
ముదురు ఎరుపు
అతని యిష్ట వర్ణం !

తల్లిని దోచుకునే దొంగలను
దారి కాసి,
వెంటాడి వేటాడటమే
అతని విధి

నా జన్మనక్షత్రం
'చిత్ర'
నేనూ భూమిపుత్రుడ్నే
అరుణ వర్ణమే
నా ఆరాధ్య దైవం.
భూమి తల్లికి జరుగుతున్న
అన్యాయాల మీదే నా పోరాటం.

చిత్రలో పుట్టినవాడు
పురుషోత్తముడు
అడపులకే తెంచి
రావణ సంహారం చేసినవాడు

ఎరుపు ప్రియులంతా,
చిత్రా నక్షత్రాంశీకులే,
చిత్రా నక్షత్రాంశీకులంతా,
భూమి పుత్రులే,
భూమి పుత్రులంతా,
పౌరుషోత్తములే.

రామకృష్ణశ్రీనిధి

# ఆదిమ కమ్యూనిష్టులు

'నిశ్చల సరస్సు
స్వచ్ఛమైన మనసుకు గుర్తు,

కుల అలలూ
మత కల్లోలాలూ ఎరుగని
క్షుధాబాధలు
సదాస్వార్థాలు తెలియని,
పసితనపు ప్రపంచానికి
తిరుగులేని చక్రవర్తులు— ఆ బాలురు.

'మానవ శ్రమకు మారక
రూపమే ద్రవ్యం—"
అనే ప్రభుత్వ ఆర్థిక సిద్ధాంతానికి—
పూర్తిగా విరుద్ధం— ఆ పసి వారు
వారికి— ప్రకృతి ఒసగినదే ప్రసాదం
వారు - కృత్రిమత్వం చొరరాని దుర్భేద్య ప్రాకారం

'ఆంక్షలు - నిషేధాలు
ఆజ్ఞలు - హద్దులు -
దేశ సరిహద్దులు'
రాష్ట్ర భాషలు'

తెలియని ఆ 'ముద్దు'బ్బాయిలకు
తెలిసినదే ప్రపంచం
అందినదే ఆనందం

సైన్సులు, సైకాలజీలు
శాఖలు, సంస్థలు
రంగ రంగాలు, రంగు రంగులు
"వద్దు వద్దం"టూ....
బుద్ధులు గరిపేబడులకు
దూరంగా వరిగెత్తే ఆ బాలురు,

ఆదిమ సమాజానికి అసలైన ప్రతీకలు
స్వాప్నిక సమానత్వాన్కి సజీవ సంకేతాలు
అసమంజసమైన అసమానత్వాన్కి దూరంగా,
సహజమైన సమానత్వాన్కి చేరువగా
పరుగులు తీసే పసిబాలురు వారు

నీరు పల్ల మెరుగు,
ప్రకృతి నిజము పసిదేముడెరుగు -

# ఓ కవీ

ఓ కవీ !
నీ కవిత్వాన్ని
ఆధారంలేని దేవుడిమీదకు
మళ్ళించకు.

లక్షాధికారుల లక్జరీ వస్తువైన
ప్రేమలవైపుకు పయనింపచేయకు

సన్యాసులకు సన్మానపత్రాలు
విరచించటానికి--
ప్రవహింపచేయకు-

ప్రకృతి సౌందర్యాన్ని
పక్షుల కిలకిలరావాల్ని
ఉదయజలాల మిలమిలల సోయగాల్ని
వర్ణించుటకై -- ఉపయోగించకు.

ఓ కవి
నీ కవిత్వంతో
శ్రామిక దైవంపై భక్తిగీతాలు వ్రాయి

ఆశయాల ప్రేమికులకు
ఆహ్వానగీతాలు పలుకు

నీ కవిత్వాన్ని, ఓ కవి,
స్వార్థాన్ని పరిత్యజించి
అడవులకే తెంచి,
సిద్ధాంత తపస్సులు ఒనరిస్తున్న
నవీన మునిపుంగవులకు
సన్మానపత్రాలు వ్రాయటానికై
వినియోగించు.

స్వప్న ప్రకృతిలోని
జన కిలకిలా రావాల్ని
మనస్సౌందర్య సోయగాల్ని
వర్ణించు
ఓ కవీ
నీ కవిత్వంతో

# నేను

ఎవరునువ్వు?-
వెన్ను చూపని వాణ్ణి
ఎదురు నిలిచే వాణ్ణి
ఎదురు కాల్పులలో మరణించని వాణ్ణి
ఎదురీతలో ఇల్లు చేరేవాణ్ణి!

పేదరికపు దూతని
దారిద్రపు రేఖని
ప్రపంచానికే త్రాతని
రేపటి తరానికి తాతని ! !

ఎవరు పంపినారు నిన్ను-
పేద సమాజపు పాలితులు
చివరి ప్రపంచపు పాలకులు
భావిశాంతి దూతలు
భావ క్రాంతి దాతలు
పంపగా వచ్చిన వాణ్ని నేను

ఏం సాధిస్తావు నీవు?-
సామ్యవాద పరిశ్రమలకు పెట్టుబడిదారినై
భవిష్యత్ ఆశ్రమాలకు ఎగ్రమట్టి దారినై
వీధివీధికీ నిలిచి పిలిచే అడవిసారినై
ఉప్పొంగి పొర్లే భావ గోదారినై

విజయరథం సాగిస్తూ
విప్లవశంఖం పూరిస్తూ

పాత గోరీలను పేల్చివేస్తా
ప్రలోభాలను పూడ్చివేస్తా

ప్రత్యామ్నాయ వర్గానికి నాయకుడనై
వినూత్న విశ్వాసామ్రాజ్యానికి రాయలునై

అడవి దారిన నడచిపోతూ
ఆకలి భేతాళుని మోసుకపోతూ

నా అన్న గృహాన్ని పూర్తిచేస్తా
నా చెల్లి కల్యాణం జరిపిస్తా

# నా గది

నేనులేని నా గది
చీకటి రాక్షసుని మది
నేనులేని నా గది
అజ్ఞాన వాయువుల్ని ప్రసవించే
అర్థంలేని విధి
నేను లేని నా గది
అజ్ఞానాంధకార సౌధానికి
పునాది
ఆదీ
నేను లేని నా గది

నేనున్న నా గది
వెలుగు కెంపుల నిధి
నేనున్న నా గది
జ్ఞాన శస్త్రాల పొది
నేనున్న నా గది
న్యాయవరదలు సంఘమించే మహానది
అసమానతల్ని దాటివచ్చే ఆశయాల వారధి
నేనున్న నా గది
విధిసౌధంపై
విజ్ఞాన శాస్త్రి శిపణిని ఎక్కుపెట్టిన
మహారథి

అది నేనున్న నా గది
అదే
నాకున్న ఒకే మది
నా మది
లో నే నుండటమే
నా విధి

# అక్షరవృక్షం

నేను
వంగని, మొక్కవోని
ఓ మొక్కని
నా తల్లి భూవితల్లి
తండ్రి సూర్యభగవానుడు
అక్షరాలే నా జీవకణజాలాలు
త్రిభూతాలు నా సోదరులు
నా ప్రాంతం, సమస్యల దుర్గమారణ్యం
నా వేళ్ళు పరిష్కారాల సారజలానికై వెతుకుతుంటాయి
నా చిగుళ్ళు ఆశయాల వెలుగువైపే ఎదుదుతుంటాయి
నా కొమ్మలు, రెమ్మలు, ఆకులే
రైతులు,
కూలీలు, కార్మికులు,
నేను పూచే పూలు
కాచే కాయలే
అడవి అన్నలు
కొండచెలెండు



రామకృష్ణ శ్రీనిధి

# ఆరో వేలు

నా చేతికి వున్నవి ఆరువేళ్ళు
ఆరోవేలికి గోరులేదు
ఐదువేళ్ళు ముడుచుకున్నప్పుడే
ఆరోవేలు పనిచేస్తుంది
దానికి
కేశనాళాలు లేవు
రక్తప్రసరణ జరగదు

దానిలో
భావపాదం పరుగులు తీస్తుంటుంది
ఆవేశపు విద్యుత్తు
అక్షరావిరులను ఎగజిమ్ముతుంది
కాయితం దాని క్షేత్రం
కావ్యం దాని గోత్రం
అది-
రక్తబీజాలను నాటుతుంది
ఎర్రపూల మొక్కలుగా మొలిపిస్తుంది
అగ్నిఫలాలను కాయిస్తుంది

అప్పుడప్పుడు అది
నా చేతినుంచి విడిపోతుంది
నా జేబుగుండెలో ఇమడి పోతుంది
అక్కడ
ఆ ప్రాణంలేని నా వేలిలో
ఈ ప్రపంచం గుండె విశ్రాంతిగొంటుంది

అది నాకలం
అదే నాకున్న బలం
మరో ప్రపంచానికదే మూలం !

# ప్రామపక్షాలం

ప్రొద్దున్నే వచ్చాడు మధు
'కొడవలుంటే ఇస్తావా, మనిషిని కోసి ఇచ్చేస్తాను' అన్నాడు.
నాకు ఆశ్చర్యం వేసింది....ఇంకా కొడవళ్ళనే
ఉదియోగిస్తున్నారా అని"
అది గ్రహించినట్లున్నాడు
"సారీ ...కోయటానికి కాదు, బొచ్చు గీరి ఇచ్చేస్తాను"అన్నాడు.
వెతికిచూస్తే కొడవలి లేదు! Raper ఇచ్చేశాకు
మధ్యాహ్నం మళ్ళీ వచ్చాడు
'సుత్తుంటే ఇస్తావా....నానమ్మకి నడుములు పట్టినాయట,
సరిచేసి ఇచ్చేస్తాను' అన్నాడు.
అపుడూ అంతే....
నా Aligner ఇచ్చేశాను
నా పార్టీ గుర్తులు రెండూ- ఇప్పుడు అతవి దగ్గరే వున్నాయ్.

*   *   *

అ రోబోట్స్ ప్రపంచంలోనూ
కమ్యూనిస్టు పార్టీ వెలిసింది.
అక్కడకూడా అది తన ప్రతిపక్ష
స్థానాన్ని పోకుండా నిలుపుకో గలిగింది !

# తా చెడ్డ కోతి....

ఎందరో మేధావులు
ఎంతో కష్టంతో
పటిష్టంగా నిర్మించిన
డెబ్బై నాలుగు అంతస్తుల
సౌమ్య సౌధాన్ని
పెరిస్ట్రోయిడికా డైనమైట్లతో
గ్లాస్ నాస్తో టనేటర్లతో
పేల్చి కూల్చిన గోర్బచేవుడు—
నేలకూలిన ఆ ఆకాశ సౌధాన్ని
అమెరికా సాంస్కృతితో
భారత సాంప్రదాయాలతో
రెట్టించిన ఎత్తులో నిర్మించి-
రష్యాని రజనీష్ ఆశ్రమంగా మారుస్తాడట!
ఓషో ప్రార్థనలు
రష్యా ప్రజలచే ప్రతినిత్యం చేయిస్తాడట!

"ఎయిడ్స్ వ్యాధులెందుకు లేవు?
ఫ్లైయింగ్ సాసర్స్ ఎందుకు రావు?"
అనే అయన మనోవేదనే కాబోలు-
రూబుల్స్‌కు వివిధ రూపాలను యిచ్చింది
రిపబ్లిక్స్‌కు సొంత సైన్యాన్ని సమకూర్చింది

పెరిస్త్రోయికా ప్రేలుళ్ళతో సమగ్రతను నాశనం చేసింది
గ్లాస్‌నాస్త్ కాల్పులతో సార్వభౌమత్వాన్ని కుంటుపరిచింది !
ఎందరో శత్రువులు ఎంతకాలంగానో సాధించలేనిదాన్ని-
గోర్బస్త్రోయికా అస్త్రం
గ్లాస్ బచేవ్ క్షిపణుల్ని ప్రయోగించి-
అనతికాలంలోనే,
రష్యాను రాజకీయంగా హిరోషిమాగా
మాస్కోను ఆర్థికంగా ఢిల్లీగా
మార్చిన ఘనత- గోర్బచేవుడిదే!
సొంత దేశంలో అశాంతి కారక
సేవలందించిన- గోర్బచేవుడ్ని
నోబుల్ శాంతి బహుమతికి ఎంచుకోవటం-
శత్రు మూకలకు ఎంతో సంతోషదాయకం !
గ్లాస్‌నాస్త్‌కంటే చెర్నోబిల్ నయం
పెరిస్త్రోయికాకంటే ఆర్మేనియా నయం
తాచెడ్డ ఆ కోతే-
తూర్పు యూరప్‌నంతా చెరిచింది!

(గోర్బచెవ్‌ను నోబుల్ శాంతి బహుమతికై
ఎన్నికచేయటం జరిగిందనే వార్త విని)



రామకృష్ణశ్రీ

# లెనిన్

ఏమోయ్ లెనిన్
ఏమిటా పిచ్చి పని?
ఏలూరురోడ్డుకు దారి చూపుతున్నావ్
అంత వెర్రిగా కనిపిస్తుందా ఈ ప్రజ?
కుడిచేయిని దింపి,
ఎడంచేతిని ఎత్తు!
అటువైపే దో కాలువ ఏడుస్తుందిగా-
అక్కడైనా జరుగుతుందేమో
ఆవిఘ్నంగా,
పరిపూర్ణంగా,
ప్రపంచ ప్రక్షాళనం!!

[విజయవాడ నగరంలో లెనిన్ విగ్రహ ప్రతిష్ఠ సందర్భంగా]

# పోలీస్

మనకి అడ్డు తగులుతున్నది ఎవరు?
మన సిద్ధాంతానిక్కి అన్యాయం చేస్తున్నది ఎవరు ?

ఖాకీ బట్టా ?
లేక
ఖాకీ బట్టలో ఇమడివున్న మాంసం ముద్దా ?

రెండూ కాదు.

జీతం రాళ్ళను ఎరచూపి
నీ తోటి పీడితుణ్ణి
ఖాకీ బట్టలలో యిరికించి,
నీ మీదకే వురికించిన
ఈ వ్యవస్థే అసలు కారణం.

పోలీస్ అంటే ఎవరు?

కఠిన హృదయాల పర్వతమూ కాదు
ప్రవహించే పాషాణమూ కాదు,

బ్రతుకు తెరువుకోసం
భార్యాబిడ్డల పోషణకోసం
ఉద్యోగంలోకి వచ్చినవాడే
పోలీస్

పాతిక రూపాయలు రోజుకూలీకోసం
ఖద్దరుశాస్త్రీ ఆనతి మేరకే
కర్రలాఠీని ఝుళిపించాడు



రామకృష్ణ శ్రీనిధి

ప్రభుత్వం ఆడమంటే ఆడి
పాడమంటే పాడి – గంజినీళ్ళకు జీతం పొందే
గుంజీళ్ళ జీతగాడు,
అతడు.



పోలీస్‌ను ఒలిచి చూస్తే
ఖాకీ బట్టలు!
మానవ ఆకారం!
ఇవి మాత్రమే కనిపిస్తాయి
ఇంకాస్త లోతుకువెళ్ళి పరికిస్తే
శ్రమ చిహ్నమైన చెమటవాసన,
కాస్తో కూస్తో మానవత్వ భావన!

అధికారం మూర్తీభవించినవాడు కాదు
పోలీస్ అంటే
అధికార మూర్చురీలో ఒదిగివున్నవాడు

ఇనుపబూట్లలో అరికాళ్ళు ముగ్గిపోతుండగా
గాలి సోకక, తలనుంచి చెమటలు ధారగా కారుతుండగా

హాయిగా కదిలే అవకాశం కూడా లేకుండా
బిగువైన బట్టలకి తనని తాను
బలమైన బెల్టుతో బంధించుకున్న
స్వేచ్ఛా ఖైదీ అతడు.

ప్రభుత్వ మెప్పు కోసం
పనులు చేసినా,
ఎరువు రంగును మాత్రం,
నెత్తిమిద వేసుకొని మోస్తూ
పరోక్షంగా మనల్ని
ఆరాధిస్తూనే వుంటాడు

అన్నా ....
అతడ్ని హతమార్చటం తోటే
ఈ వ్యవస్థ మారదు!

ప్రజల్లో సిద్ధాంత చైతన్యాన్ని
ఉద్భవింప చేయాలి—

మనలోనే
కొందర్ని పోలీసులుగానూ
మరి కొందర్ని నక్సలైట్లుగానూ
మార్చి
తుపాకులు చేతికిచ్చి
కాల్చుకు చస్తుంటే....
పైన కూర్చుని చూస్తూ
పై పందాలను కాసుకుంటూ
వినోదిస్తున్న
ఈ వ్యవస్థ గుండెల్లో
తుపాకీ గుండు దింపండి.
దాని గర్భంలో మందుపాతర్లు
పేల్చండి !

లక్ష్యం లేకుండా
మానవ సమూహం మీదకు వదిలిన
తుపాకీ గుండులాంటిదే,....
"మంచివాడైనా,
చెడ్డవాడైనా
ఖాకీబట్టలు ధరించిన ప్రతివాడ్ని
సందు దొరికితే
మందు పాతర్లతో చంపాలి."
అనే ఆలోచన!

(ఓ పోలీస్ మిత్రుడు కోరిన మీదట—)



